

# బ్రాహ్మ వివాహ విధానము.

ఇది



## కందుకూరి వీరేశలింగముచే

ప్రకటింపఁబడి

యస్. గున్నేశ్వర్రావు బ్రదర్సువారి

శ్రీ చింతామణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

రాజమహేంద్రవరము.



28-7-09.



దీని వెల 2 అణాలు.

# బ్రాహ్మవివాహవిధానము

—:o:—

భగవత్స్మరణము.

౧. అగ్నియందును, జలమునందును, ఓషధులయందును, వృక్షముల యందును, సమస్తలోకమునందును, ఏదేవుఁడు వ్యాపించి యున్నాఁడో ఆదేవునకు నమస్కారము; నమస్కారము.

౨. ప్రాణము, మనస్సు, సర్వేంద్రియములు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, సమస్తమును ధరించెడుభూమి, ఈతనివలన పుట్టు చున్నవి.

3. ఈతనిభయమువలన అగ్ని వేఁడిమినిచ్చుచున్నది; సూర్యుఁడు వేఁడిమి నిచ్చుచున్నాఁడు; మేఘుఁడును వాయువును ఐదవది యైనమృత్యువును పరుగిడుచున్నవి.

---

౧. యోదేవోఽగ్నౌ యోఽప్సు యోవిశ్వంభువన మావివేశ
య ఓషధీషు యోవనస్పతిషు తస్మై దేవాయ నమోనమః.—

౨. ఏతస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణిచ
ఖం వాయుర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్యధారిణీ.—

3. భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః
భయా దింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః.—

౪. ఎవ్వఁ డొక్కఁడో, వర్ణరహితుఁడో, శక్తియోగమువలన ప్రయోజనమును దెలిసి బహువిధములుగా ననేకవర్ణముల నిచ్చుచున్నాఁడో, అంతమందును ఆదియందును విశ్వమును వ్యాపించియున్నాఁడో, ఆదేవుఁడు మనకు మంచిబుద్ధిని నమకూర్చును గాక!

౫. ఎవరిహృదయమునందు మంగళాకరుఁడును పాపసంహారుఁడును నైన భగవంతుఁ డుండునో వారికెప్పుడును ఏకార్యమునందును అమంగళ ముండదు.

౬. సర్వలోకేశ్వరునకు నమస్కారము; పరమేశ్వరునకు నమస్కారము; సర్వశుభప్రదాయకునకు నమస్కారము; విఘ్ననివారకునకు నమస్కారము; శ్రీపరబ్రహ్మమునకు నమస్కారము.

---

౪. య ఏకోవర్ణో బహుధా శక్తియోగాత్
వర్ణా ననేకా న్నిహితార్థో దధాతి
విచైతి చాంతే విశ్వ మాదౌ స దేవః
సనోబుద్ధ్యా శుభయా సంయునక్తు.—

౫. సర్వదా సర్వకార్యేషు నాస్తి తేషా మమంగళం
ఏషాంహృదిస్థో భగవాన్ మంగళాయతనం హరిః.—

౬. సర్వజగదీశ్వరాయ నమః, పరమేశ్వరాయ నమః, సర్వమంగళప్రదాయకాయ నమః, విఘ్ననివారకాయ నమః, శ్రీపరబ్రహ్మణే నమః.

## స్వస్తి పుణ్యాహవచనాదికము.

కన్యాప్రదాత— ౭. ఆకాశమునందువ్యాపించినపదార్థములను నేత్రము చూచునట్లే జ్ఞానులు సర్వవ్యాపకుఁడైనపరమేశ్వరునిపరమపదమును సదాచూచుచున్నారు.

౮. కుటుంబసహితముగా మహాజనులకు నమస్కారముచేసి, యాశీర్వచన మపేక్షించుచున్నాను. చేయఁబోవుచున్నవివాహకార్యమునందు మీరు శుభము పలుకుదురుగాక!

సభ్యులు— ౯. ఆయుష్మంతుఁడవై నసీకుశుభము(అగుఁనుగాక!).

కన్యాప్రదాత— ౧౦. చేయఁబోవుచున్నవివాహకార్యమునందు మీరు పుణ్యాహము పలుకుదురుగాక!

సభ్యులు— ౧౧. పుణ్యాహ మగునుగాక!

కన్యాప్రదాత— ౧౨. చేయఁబోవుచున్నవివాహకార్యమునందు మీరు సమృద్ధిని పలుకుదురుగాక!

---

౭. ఓం, తద్విష్ణోః పరమంపదం సదా పశ్యంతి సూరయః దివీవ చక్షు రాతతం —

౮. మహ్యం సహకుటుంబాయ మహాజనాన్నమస్కార్వాణాయ ఆశీర్వచన మపేక్షమాణాయ కరిష్యమాణవివాహకర్మణిస్వస్తిభవంతో బ్రువంతు!

౯. ఓం, ఆయుష్మతే స్వస్తి!

౧౦. కరిష్యమాణవివాహకర్మణి పుణ్యాహం భవంతో బ్రువంతు!

౧౧. ఓం, పుణ్యాహం!

౧౨. కరిష్యమాణ వివాహకర్మణి ఋద్ధిం భవంతో బ్రువంతు!

సభ్యులు—౧౩. సమృద్ధి కలుగునుగాక!

శాంతికలుగునుగాక! పుష్టికలుగునుగాక! తుష్టి కలుగునుగాక! వృద్ధికలుగునుగాక! అవిఘ్నము కలుగునుగాక! ఆయుస్సుకలుగునుగాక! ఆరోగ్యముకలుగునుగాక! కార్యములందు మంగళ మగునుగాక! సత్కర్మసమృద్ధి కలుగునుగాక! కీడుతొలఁగునుగాక! ఏదిపాపమో యదిప్రతిహత మగునుగాక! ఏదిశ్రేయస్సో యదియగునుగాక!

వరణము.

కన్యాదాత.—౧౪. ఇదిగో అర్ఘ్యము. ప్రతిగ్రహింపుము.

వరుఁడు.—౧౫. అర్ఘ్యమును ప్రతిగ్రహించుచున్నాను.

కన్యాదాత.—౧౬. ఇదిగో వస్త్రము. ప్రతిగ్రహింపుము.

వరుఁడు.—౧౭. వస్త్రమును ప్రతిగ్రహించుచున్నాను.

కన్యాదాత.—౧౮. ఇదిగో ఉంగరము. ప్రతిగ్రహింపుము.

వరుఁడు.—౧౯. ఉంగరమును ప్రతిగ్రహించుచున్నాను.

---

౧౩. ఓం, ఋధ్యతాం!

శాంతిరస్తు! పుష్టిరస్తు! తుష్టిరస్తు! వృద్ధిరస్తు! అవిఘ్నమస్తు! ఆయుష్యమస్తు! ఆరోగ్యమస్తు! శివం కర్మాస్తు! సత్కర్మ సమృద్ధిరస్తు! ధర్మసమృద్ధిరస్తు! అరిష్టనిరసనమస్తు! యత్పాపంతత్ప్రతిహతమస్తు! యచ్ఛ్రేయస్తదస్తు!

౧౪. ఓం, ఇద మర్ఘ్యం ప్రతిగృహ్యతాం.

౧౫. అర్ఘ్యం ప్రతిగృహ్ణామి.

౧౬. ఓం, ఏష పరిచ్ఛదం ప్రతిగృహ్యతాం.

౧౭. పరిచ్ఛదం ప్రతిగృహ్ణామి.

౧౮. ఓం, అంగులీయం ప్రతిగృహ్యతాం.

౧౯. అంగులీయం ప్రతిగృహ్ణామి.

కన్యాదాత.—౨౦. బ్రహ్మము నత్యము.

ఇప్పుడు, ఈ—మాసమునందు, సూర్యుఁడు
ఈ—రాశియందుండఁగా, ఈ—పక్షమునందు,
ఈ—తిథియందు, ఈ——వాసరమున,
ఈ—గోత్రమును——ప్రవరయునుగల యీ
తని——మునిమనుమరాలును, ఈ—గోత్ర
మును—ప్రవరయుఁగలయీతని——మనుమ
రాలును, ఈ—గోత్రమును—ప్రవరయుఁగల
యీతని——కొమారితయు, ఈ——గోత్ర
మును—ప్రవరయుఁగల శ్రీ—దేవియనుకన్యను
శుభబ్రాహ్మవివాహముచేత దానముచేయుటకై
యీ యర్ఘ్యాదులచేత నర్చించి భద్రుఁడవైన
నిన్ను వరునిగా వరించుచున్నాను.

వరుఁడు.—౨౧. నేను వరింపఁబడినవాఁడనైతిని.

---

౨౦. ఓం తత్సత్.

అద్య, అముకే——మాసి, అముక—రాశిస్థే
భాస్కరే, అముక—పక్షే, అముక—తిథౌ,
అముక——వాసరే, అముక——గోత్రస్య
అముక—ప్రవరస్యఅముకస్య——ప్రపౌత్రీం,
అముక—గోత్రస్య అముక ప్రవరస్య అము
కస్య——పౌత్రీం, అముక——గోత్రస్య
అముక——ప్రవరస్యఅముకస్య——పుత్రీం,
అముక—గోత్రాం అముక——ప్రవరాం శ్రీ
అముకీం—దేవీంకన్యాం శుభబ్రాహ్మవివాహేన
దాతుం ఏభిరర్ఘ్యాదిభి రభ్యర్చ్య వరత్వేన భవం
తం భట్టం వృణే.

౨౧. ఓం, వృతోస్మి.

---

పరస్పరాంగీకారము.

ఆచార్యుఁడు—౨౨. శ్రీమాన్—ఆర్య! శ్రీమతియా—దేవినిపత్నినిగా గ్రహించుటకు నీవు కృతసంకల్పుఁడవయినావా?

వరుఁడు—౨౩. అయినాను.

ఆచార్యుఁడు—౨౪. శ్రీమతి—దేవీ! శ్రీమాన్—ఆర్యుని పతినిగా గ్రహించుటకునీవు కృతసంకల్పురాలవయినావా?

వధువు—— ౨౫. అయినాను.

---

ఈశ్వరోపాసనము.

౨౬. బ్రహ్మము సత్యస్వరూపమైనది, జ్ఞానాత్మకమైనది, అంతము లేనిది, ఆనందస్వరూపమైనది, శాంతమైనది, మంగళస్వరూపమైనది, అద్వితీయమైనది, పరిశుద్ధ [illegible] పరహితమైనది.

---

౨౨. శ్రీమాన్ [illegible]—ఆర్య! కింత్వమేతాం శ్రీమతీ మముకీం—దేవీమ్ పత్నీత్వేన గ్రహీతుం కృతసంకల్పః?

౨౩ ఓం. కృతసంకల్పోస్మి.

౨౪ శ్రీమత్యముకీ — దేవి! కింత్వమిమం శ్రీమంతమముకం—ఆర్యం పతిత్వేన గ్రహీతుం కృతసంకల్పా?

౨౫. ఓం. కృతసంకల్పాస్మి.

౨౬. సత్యం జ్ఞానమనన్తంబ్రహ్మానందరూపమమృతం యద్విభాతి శాంతం శివమద్వైతం శుద్ధమపాపవిద్ధమ్.

౨౭. సత్స్వరూపుఁడవును జగత్కారణుఁడవును అగు నీకు నమస్కారము; జ్ఞానస్వరూపుఁడవును సర్వలోకాశ్రయుఁడవును అగు నీకు నమస్కారము; అద్వైతతత్త్వమవును ముక్తిదాయకుఁడవును అగు నీకు నమస్కారము; సర్వవ్యాపియు శాశ్వతుఁడును అగు బ్రహ్మమునకు నమస్కారము.

౨౮. నీవొక్కఁడవే శరణ్యుఁడవు; నీవొక్కఁడవే వరేణ్యుఁడవు; నీవొక్కఁడవే జగత్పాలకుఁడవు స్వప్రకాశుఁడవు; నీవొక్కఁడవే జగత్కర్తవు రక్షకుఁడవు సంహర్తవు; నీవొక్కఁడవే సర్వశ్రేష్ఠుఁడవు నిశ్చలుఁడవు నిర్వికల్పుఁడవు.

౨౯. నీవు భయములకు భయంకరుఁడవు; భీషణములకు భీషణుఁడవు; ప్రాణులకు గతివి; పావనులకు పావనుఁడవు; మహోన్నతపదములకు నియామకుఁడవు; నీవొక్కఁడవే శ్రేష్ఠులకు శ్రేష్ఠుఁడవు; రక్షకులకు రక్షకుఁడవు.

---

౨౭. నమస్తే సతే తే జగత్కారణాయ నమస్తే చితే సర్వలోకాశ్రయాయ నమోద్వైతతత్త్వాయ ముక్తిప్రదాయ నమో బ్రహ్మణే వ్యాపినే శాశ్వతాయ.

౨౮. త్వమేకం శరణ్యం త్వమేకం వరేణ్యం త్వమేకం జగత్పాలకం స్వప్రకాశం త్వమేకం జగత్కర్తృ పాతృ ప్రహర్తృ త్వమేకం పరం నిశ్చలం నిర్వికల్పమ్.

౨౯. భయానాం భయం భీషణం భీషణానాం గతిః ప్రాణినాం పావనం పావనానాం మహోచ్చైః పదానాం నియన్తృ త్వమేకం పరేషాం పరం రక్షణం రక్షణానాం.

౩౦. మేము నిన్ను స్మరించెదము; మేము నిన్ను భజించెదము; జగత్సాక్షిరూపుఁడవగు నీకు నమస్కరించెదము; సత్స్వరూపుఁడవును అద్వితీయుఁడవును ఆదికారణుఁడవును నిరాలంబుఁడవును ఈశ్వరుఁడవును పాపసముద్రమున కోడవును అగు నిన్ను శరణొందుచున్నాము.

౩౧. అసత్తునుండి మమ్ము సత్తును పొందింపుము; అంధకారమునుండి మమ్ము తేజస్సును పొందింపుము మృత్యువునుండి మమ్ము అమృతత్వమును పొందింపుము; ఓస్వప్రకాశుఁడా! మాకు నీప్రకాశమును ప్రకటింపుము; ఓపరమేశ్వరా! నీకరుణాముఖముచే మమ్ము సర్వదా కాపాడుము.

---

౩౦. వయంత్వాం స్మరామో వయంత్వాంభజామో వయంత్వాం జగత్సాక్షిరూపం నమామః సదేకం నిధానం నిరాలంబ మీశం భవాంభోధిపోతం శరణ్యం వ్రజామః.

౩౧. అసతో మాసద్గమయ తమసో మాజ్యోతిర్గమయ మృత్యోర్మామృతం గమయ ఆవిరావీర్మ ఏధి రుద్ర యత్తేదక్షిణం ముఖం తేన మాంపాహినిత్యమ్.

---

కన్యాదానము.

3౨. సద్గుణ సంపన్నురాలును స్వర్ణాభరణభూషితు
రాలును నగు కన్యను ఉభయుల హితమును
గోరి విద్యావంతుఁడ వగునీ కిచ్చుచున్నాను.

33. విశ్వంభరుఁడును సర్వశక్తుఁడును నగు ప్రభు
వీకర్మయందు సాక్షియయియుండఁగా ధర్మాభి
వృద్ధికొఱకు ఈకన్యను నీకు దానము చేయు
చున్నాను.

3ర. ఇప్పుడు, ఈ—సంవత్సరమున, ఈ—మాసము
నందు, సూర్యుఁడు ఈ—రాశియందుండఁగా,
ఈ—పక్షమునందు, ఈ—తిథియందు, ఈ—వా
రమున, ఈ—గోత్రముగల యీశ్వరప్రీతికాముఁ
డనైన నేను, ఈ—గోత్రమును—ప్రవరయుఁ
గల యీతని—ప్రపౌత్రుఁడును, ఈ—గోత్ర
మును—ప్రవరయుఁగలయీతని—పౌత్రుఁడును,

---

3౨. కన్యాం సద్గుణసంపన్నాం కనకాభరణై ర్యుతాం
విద్వన్ తుభ్యంప్రదాస్యామి ఉభయోర్హితకామ్యయా.
33. విశ్వంభర స్సర్వశక్తిః సాక్ష్యస్మిన్ కర్మణి ప్రభుః
ఇమాంకన్యాంప్రదాస్యామితుభ్యంధర్మవివృద్ధయే.
3ర. అద్య, అముకే సంవత్సరే, అముకే—మాసి,
అముకే—రాశిస్థే భాస్కరే, అముక—పక్షే,
అముక—తిథౌ, అముక— —వాసరే, అము
క—గోత్రః శ్రీఅముకః—ఈశ్వరప్రీతికామో
అహం, అముక—గోత్రస్య,అముక—ప్రవరస్య,
అముకస్య—ప్రపౌత్రాయ,అముక—గోత్రస్య,
అముక—ప్రవరస్య, అముకస్య—పౌత్రాయ,

ఈ—గోత్రమును—ప్రవరయుఁగలయీతని—పుత్రుఁడును, ఈ—గోత్రమును—ప్రవరయుఁగలిగి బ్రహ్మనిష్ఠుఁడవును బ్రాహ్మణుఁడవును వరుఁడవును అయిన—అనునీకు, ఈ—గోత్రమును—ప్రవరయుఁగల యీతని—ప్రపౌత్రియు, ఈ—గోత్రమును—ప్రవరయుఁ గలయీతని—పౌత్రియు, ఈ—గోత్రమును—ప్రవరయుఁగల యీతని—పుత్రియు, ఈ—గోత్రమును—ప్రవరయుఁగలయీ—దేవియను సాలంకారయు ఆరోగిణియు సుశీలయు వస్త్రాచ్ఛాదితయునైన యీకన్యను దానముచేయుచున్నాను.

---

అముక—గోత్రస్య—ప్రవరస్య, అముకస్య—పుత్రాయ అముక—గోత్రాయ, అముక—ప్రవరాయ, శ్రీఅముకాయ—వరాయ, బ్రహ్మనిష్ఠ బ్రాహ్మణాయతుభ్యం, అముక—గోత్రస్య, అముక—ప్రవరస్య, అముకస్య—ప్రపౌత్రీం, అముక—గోత్రస్య, అముక—ప్రవరస్య, అముకస్య—పౌత్రీం, అముక—గోత్రస్య, అముక—ప్రవరస్య, అముకస్య—పుత్రీం, అముక—గోత్రాం, అముక—ప్రవరాం, శ్రీఅముకీం—దేవీం, సాలంకారాం, ఆరోగిణీం, సుశీలాం, వాససాచ్ఛాదితాం, ఏనాం కన్యాం, సంప్రదదే.

౩౫. ఈకన్య ధర్మార్థకామసిద్ధికొఱకు విద్యావంతుఁడవైన నీకు నాచే నియ్యఁబడినది. ధర్మమునందును అర్థమునందును భోగమునందును నీ వీమె నతిక్రమించి చరింపఁ గూడదు.

వరుఁడు ౩౬. అతిక్రమించి చరింపఁగల వాఁడను కాను.

పాణిగ్రహణము.

వరుఁడు— ౩౭. (తన చేతితో వధువు చేయిపట్టుకొని) నేను సౌభాగ్యము కొఱకు నీహస్తమును గ్రహించుచున్నాను. ఆలాగున నీవు యావజ్జీవమును నాతోడఁ గూడ నుందువుగాక!

౩౮. ప్రేమ ప్రేమనిచ్చెను. ప్రేమ దాత, ప్రేమ ప్రతిగృహీత, ప్రేమ చేత నిన్ను ప్రతిగ్రహించుచున్నాను. ధర్మసిద్ధికొఱకును సుఖసిద్ధికొఱకును కన్యవైన నిన్ను ప్రతిగ్రహించుచున్నాను.

---

౩౫. తుభ్యం విద్వన్ మయాదత్తా ధర్మకామార్థసిద్ధయే ధర్మేచార్థేచ కామేచ నాతిచరితవ్యా త్వయేయమ్.

౩౬. నాతిచరిష్యామి.

౩౭. ఓం. గృహ్ణామి తే సౌభగత్వాయ హస్తం మయాపత్యా జరదష్టిర్యథాసః.

౩౮. ప్రేమా ప్రేమ్ణోదాత్. ప్రేమా దాతా, ప్రేమా ప్రతిగృహీతా; ప్రేమ్ణా త్వాం ప్రతిగృహ్ణామి.

మాంగళసూత్రధారణము.

౩౯. ఓ సౌభాగ్యవతీ! నాప్రేమచిహ్నముగా ఈమాంగళ్య సూత్రమును నీకు కంఠమునందు కట్టుచున్నాను. నాతోఁగూడ ధర్మమార్గమున చరింపుము.

వివాహబంధము.

(వధూవరుల బట్టకొనలు ముడివైచినమీఁదట.)

౪౦. సత్యగ్రంథిచేత మనస్సును హృదయమును నీకు బంధించుచున్నాను. నాయొక్క యీహృదయము నీహృదయమగునుగాక! నీయొక్క యీహృదయము నాహృదయమగునుగాక! ఈప్రకారముగా కూర్పఁబడిన మనహృదయములు పరమేశ్వరునివగునుగాక!

౪౧. పవిత్రుఁడైన పరమేశ్వరుఁడు సాక్షిగా శ్రీమతివైన——అనునిన్ను నేను ఇప్పుడు ధర్మపత్నినిగా స్వీకరించుచున్నాను.

వధువు—— ౪౨. పవిత్రుఁడైన పరమేశ్వరుఁడు సాక్షిగా శ్రీయుతుఁడవైన——అను నిన్ను నేనిప్పుడు ధర్మపతినిగా స్వీకరించుచున్నాను.

---

౩౯. మాంగళ్యతంతుమేతం తేమమప్రేమసంబంధకమ్ కంఠే బధ్నామి సుభగే ధర్మంచర మయా సహ.

౪౦. ఓం. బధ్నామిసత్యగ్రంథినామనశ్చహృదయంచ తే. ఓం. యదేతత్ హృదయంమమతదస్తుహృదయంతవ; యదేతత్ హృదయంతవ తదస్తు హృదయంమమ. య ఏతే హృదయే నౌ స్తాముభయోరీశ్వరస్య తే.

౪౧. పవిత్రపరమేశ్వరస్యసాక్షిత్వేన శ్రీమతీమముకీం ... త్వామహమ్ అద్య ధర్మపత్నీత్వేన స్వీకరోమి.

౪౨. పవిత్రపరమేశ్వరస్యసాక్షిత్వేన శ్రీమంతమముకం త్వామహమద్య ధర్మపతిత్వేన స్వీకరోమి.

వరుఁడు— ౪౩. సంపదయందును ఆపదయందును సుఖమునందు
ను దుఃఖమునందును ఆరోగ్యమునందును రోగ
మునందును నీక్షేమసంపాదనమునందు యత్నిం
చువాఁడ నయ్యెదను.

వధువు— ౪౪. సంపదయందును ఆపదయందును సుఖమునందు
ను దుఃఖమునందును ఆరోగ్యమునందును
రోగమునందును నీక్షేమసంపాదనమునందు
యత్నించుదాన నయ్యెదను.

వరుఁడు— ౪౫. నాయొక్క యీహృదయము నీహృదయ మగును
గాక! నీయొక్క యీహృదయము నాహృదయ
మగునుగాక! ఈప్రకారముగా కూర్పఁబడిన మన
హృదయములు పరమేశ్వరుని వగనుగాక!

వధువు— ౪౬. నాయొక్క యీహృదయము నీహృదయమగును
గాక! నీయొక్క యీహృదయము నాహృదయమగు
ను గాక! ఈప్రకారముగా కూర్పఁబడినమనహృద
యములు పరమేశ్వరుని వగునుగాక!

---

౪౩. సంపది విపది, సుఖే దుఃఖే, సుస్థతాయామసుస్థతా
యాంచ, తవమంగళసాధనే యత్నవానస్మి.

౪౪. సంపది విపది, సుఖే దుఃఖే, సుస్థతాయామసుస్థతా
యాంచ తవమంగళసాధనే యత్నవత్యస్మి.

౪౫. ఓం. యదేతత్ హృదయంమమతదస్తు హృదయంతవ,
యదేతత్ హృదయంతవ తదస్తుహృదయంమమ;
యఏతే హృదయేనౌస్తాముభయోరీశ్వరస్యతే.

౪౬. ఓం. యదేతత్ హృదయంమమ తదస్తుహృదయంతవ,
యదేతత్ హృదయంతవ తదస్తుహృదయంమమ,
యఏతే హృదయేనౌస్తాముభయోరీశ్వరస్యతే.

వరుఁడు——౪౭. నీవు నాసఖురాలవు కమ్ము. నేను నీకు సఖుఁడ నయ్యెదను. మనసఖ్య మెప్పుడును భంగము నొందకుండునుగాక!

వధువు—— ౪౮. నీవు నాసఖుఁడవుకమ్ము. నేను నీకు సఖురాలనయ్యెదను. మనసఖ్య మెప్పుడును భంగము నొందకుండునుగాక!

ప్రార్థన.

వధూవరులు—— ౪౯. ఓయీశ్వరా! ఈప్రతిజ్ఞలనుపరిపాలించుటయందు మాకు సహాయుఁడవు కమ్ము.

సప్తపది.

---

[ఒక్కొక్కపాదము పెట్టునప్పుడు భర్త యొక్కొకయుపదేశము చేయవలెను.]

—1. ఈశ్వరలాభముకొఱకు మొదటియడుగును పెట్టుము. ఇట్లు నన్ననుసరించుదానవుకమ్ము.

---

౪౭. సఖీభవ త్వం నను తే భవామి
సఖా, ప్రభిద్యేత ససఖ్య మావయోః.

౪౮ సఖాభవత్వం నను తే భవామి
సఖీ, ప్రభిద్యేత న సఖ్య మావయోః

౪౯. రక్షణో౽స్యాః ప్రతిజ్ఞాయాః సహాయోభవ మే ప్రభో.

—1. ఓం. ఈశే ఏకపదీ భవ. సా మా మనువ్రతా భవ.

2. బలలాభముకొఱకు రెండవయడుగును పెట్టుము. ఇట్లు నన్ననుసరించుదానవు కమ్ము.

3. నియమపాలనముకొఱకు మూడవ యడుగును పెట్టుము. ఇట్లు నన్ననుసరించుదానవుకమ్ము.

4. సుఖలాభముకొఱకు నాలవ యడుగును పెట్టుము. ఇట్లు నన్ననుసరించుదానవుకమ్ము.

5. సంతానలాభముకొఱకు ఐదవయడుగును పెట్టుము. ఇట్లు నన్ననుసరించుదానవుకమ్ము.

6. సంపల్లాభముకొఱకు ఆఱవయడుగును పెట్టుము. ఇట్లు నన్ననుసరించు దానవుకమ్ము.

7. ఏడవయడుగును పెట్టి నాకు సఖురాలవుకమ్ము. నేను నీసఖ్యమును పొందుచున్నాను.

ఆచార్యోపదేశము.

౫౦—1. (వధూవరులనుగూర్చి) ఇప్పుడు మంగళస్వరూపుఁడును కరుణామయుఁడును నైనపరమేశ్వరునియొక్క ప్రసాదమువలన నాతని

---

2. ఓం. ఊర్జే ద్విపదీ భవ. సా మా మనువ్రతా భవ.

3. ఓం. వ్రతాయ త్రిపదీ భవ. సా మా మనువ్రతా భవ.

4. ఓం.మయోభవాయచతుష్పదీభవ.సామామనువ్రతాభవ.

5. ఓం. ప్రజాభ్యః పంచపదీ భవ. సామామనువ్రతా భవ.

6. ఓం. రాయస్పోషాయషట్పదీభవ. సామామనువ్రతాభవ.

7. ఓం. సఖా సప్తపదీ భవ. అహం తవసఖ్యం లభే.

---

౫౧—1. అద్య మంగళస్వరూపస్య కరుణామయస్య పరమేశ్వరస్య ప్రసాదాత్ తస్యపవిత్రే సన్నిధానే వివాహశృంఖలేన యువామాబద్ధౌ. అద్యావధిస్వస్యైవ సుఖోన్నతిం మనసినిధాయ

పవిత్రసన్నిధానమునందు వివాహ శృంఖలముచేత మీరు కట్టఁబడినారు. ఇప్పటివఱకును స్వసుఖోన్నతిని మాత్రమే మనస్సులో నుంచుకొని యేకాకిజీవనమార్గమున సంచరించితిరి. ఇప్పుడు వివాహసంబంధజనితమైన గురుతరభారము మీ హస్తమునందు పెట్టఁబడినది. ఇప్పుడు మీరు సంసారము యొక్క మొదటిమెట్టుమీఁద కాలు మోపితిరి. అవధానముతో ముందుకు నడచువారగుదురుగాక! దీనిమార్గము లతిదుర్గమములు; దీనియాశలగుంపులు అపరిమితములుగా నున్నవి. ఎప్పుడును సాంసారికమోహజాలముచేత చుట్టఁబడినవారు కాకుండులాగున హెచ్చరిక గలవారగుదురుగాక! సాంసారికసుఖసంపత్తికొఱకు సర్వసుఖదాతయైన పరమేశ్వరుని మఱవకుందురుగాక! సత్యస్వరూపునియందు సంపూర్ణవిశ్వాసముంచి యొండొరుల యున్నతిసాధనము కొఱకును సుఖవర్ధనము కొఱకును యత్నించుచుండువారగుదురుగాక!

---

ఏకాకీజీవనపథే వ్యచరత్. అధునా వివాహసంబంధజనితః గురుతరభారః యువయోర్హస్తే న్యస్తః. అద్య యువాం సంసారస్య ప్రథమసోపానే పాదం నిక్షిపథ. అవధానేన అగ్రసరౌ భవేతాం. అస్య పంథానః అతిదుర్గమాః. అస్య ప్రలోభనరాశయః అపరిమితాస్సన్తి. అవహితౌ భవేతం యత్ కదాచన సాంసారికమోహజాలే నావృతౌ మాభూతమ్. సాంసారిక సుఖసంపత్త్యై సర్వసుఖదాతారం పరమేశ్వరం నవిస్మరేతాం. సత్యస్వరూపే సంపూర్ణవిశ్వాసం కృత్వా పరస్పరస్య ఉన్నతిసాధనాయ సుఖవర్ధనాయచ

గృహకార్యములు సర్వమును ఈశ్వరప్రియ కార్యములని భావించి సాధింపవలయును.

"గృహస్థుఁడు బ్రహ్మనిష్ఠుఁడును తత్త్వజ్ఞానపరాయణుఁడును కావలెను;
ఏయేకర్మను జేయునో దానిని బ్రహ్మమునందు సమర్పింపవలెను."

అనెడి బ్రాహ్మధర్మముయొక్క యీశుభోపదేశమును హృదయగతము చేసికొని, సర్వమును మీరు ఈశ్వరునకు సమర్పింపవలెను. అతఁడు మిమ్ము రోగ శోక భయ విపత్తి పాప తాపములనుండి యుద్ధరింపఁగలఁడు.

2. (వరునిగూర్చి) శ్రీమన్—నీవు నియతముగా నీభార్యయొక్క శుభాభివృద్ధియందు యత్నించువాఁడవు కమ్ము. ఇప్పుడు పరమేశ్వరునిచేత నీమీఁద గురుతరమైనసంసారభార ముంచఁబడినది. నీవు సంయతేంద్రియుఁడవును సత్కర్మశీలుఁడవునుకమ్ము. సాంసారికమగు సర్వావస్థలయందును శాంతచిత్తుఁ

---

యత్నశీలౌ భవేతాం. గృహకార్యాణి సర్వాణి ఈశ్వరప్రియకర్మాణీతి మత్వా సాధయేతాం

"బ్రహ్మనిష్ఠో గృహస్థః స్యాత్ తత్త్వజ్ఞానపరాయణః
యద్యత్కర్మ ప్రకుర్వీత తద్బ్రహ్మణి సమర్పయేత్." ఇతి

బ్రాహ్మధర్మస్యాయమ్ శుభోపదేశమ్ హృదయగతంకృత్వా, సర్వంహియుష్మాభిః ఈశ్వరాయ సమర్పయేత్. స యుష్మాన్ రోగ శోక భయ విపత్తి పాప తాపేభ్యః ఉద్ధరిష్యతి.

2. శ్రీమన్—త్వం నియతం తవపత్న్యాః మంగళవర్ధనే యత్నశీలో భవ. అద్య పరమేశ్వరేణ తవోపరి సంసారస్య గురుతరభారో న్యస్తః. త్వం సంయతేంద్రియః సత్కర్మశీలశ్చ భవ. సాంసారికాయాం సర్వస్యామవస్థాయాం శాంతచిత్తో భవ. యథా ఆత్మానం [illegible]

డవు కమ్ము. ఏప్రకారముగా నిన్ను కాపాడుకొనుటకును ఉన్నతి నొందించుకొనుటకును యత్నము చేయుదునో, ఆప్రకారముగానే నీభార్యను సహితము పవిత్రమైన ధర్మపథమునందు ఉన్నతిని పొందించుటకు యత్నించువాఁడవు కమ్ము. ఈమె సత్యసుఖమార్గమునందు చిరకాలము సీతవలె చరించు లాగున, ఉపదేశముచేతను దృష్టాంతముచేతను నిత్యమును సత్కార్యములయందును గృహకృత్యముల యందును నిరతురాలినిగా దిద్దుము.

3. (వధువును జూచి) శ్రీమతి—— దేవీ! దేనిచేత నీభర్తకు మంగళములు కలుగునో దానిని నీవు మనోవాక్కాయముల చేత నాచరింపవలయును. నీవు భర్తయం దేకాగ్ర మనస్సుతో నుండుము. నీమేలుకొఱ కతఁ డేది యుపదేశించునో దానిని నీవు పాలింపవలయును. నీవు పాతివ్రత్య ప్రాణముగాఁ గలదానవును సదాచారవతివును కమ్ము. అపరిమితవ్యయము కాని యెవరితోను కలహము కాని యొనర్పకుండుము.

---

భవిష్యసి తథా త్వమపి మయా సహ పవిత్రే ధర్మపథే ఉన్నతిం యత్నశీలా భవ. ఉపదేశేన దృష్టాంతేన నిత్యం తాం కల్యాణకార్యేషు గృహకృత్యేషు నిరతా భవతు యత్ సా సత్యసుఖమార్గే చిరం సీతేవ చరేత్.

3. శ్రీమతి——దేవి! యేన తవ భర్తుః మంగళాని భవేయుః కాయవాఙ్మనోభిః స్త్వయా తథా వర్తితవ్యం. త్వం భర్తరి ఏకాగ్రమనసా తిష్ఠ, తవ హితాయ స యత్ ఆదేశతి త్వయా తత్పాలనీయమ్. త్వం పతివ్రతా సదాచారా భవ. అపరిమితవ్యయం వా కేనాపి సహ కలహం వా నానుతిష్ఠ. ఏవం

ఈప్రకారముగా భర్త యొక్క సాహాయ్యము నందుచు ఆత్మోన్నతిసాధనము నందుటను యత్నించుదానవు కమ్ము.

4. (ఉభయులను గూర్చి) కరుణామయుఁడైన పరమేశ్వరుఁడు మీ యుభయులకు క్షేమ మొసఁగునుగాక! ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

(వధూవరులొండొరుల కంఠమునందు పుష్పహారములు వేయవలెను. మంగళముపాడి స్త్రీలు హారతియియ్యవలెను.)

సమాప్తము.

---

భర్తుః సాహాయ్యే ఆత్మోన్నతి సాధనేచ యత్నశీలా భవ.

4. కరుణామయః పరమేశ్వరో యువయోః క్షేమం విదధాతు! ఓం శాంతిః. శాంతిః. శాంతిః.

సమాప్తిః.



